# భారతిసూచి

**1973 - 91 మధ్యకాలంలో 'భారతి' సాహిత్య పత్రికలో వెలువడిన వ్యాసాది రచనలకు అనుక్రమణిక**


*ప్రధాన సంకలనం*

డాక్టర్ యం. శంకరరెడ్డి

*సంకలనం*

లింగాల పాండురంగయ్య

యస్. మోహన్‌రెడ్డి

*సహాయం*

పి. మల్లికార్జునరావు

టి.వాణీరావు

**BHARATHI SOOCHI** : 1973 - 91 Madhya Kaalamlo
Bharathi Sahitya Patrikalo Veluvadina
Vyasaadi Rachanalaku Anukramanika

---

*ప్రకాశకులు :*
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004

ISBN 81 - 86073 - 04 - 3

© పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం 1997

*ప్రథమ ముద్రణ :* మార్చి, 1997

*ప్రతులు :* 500

*వెల రూ.* **190/-**

*ప్రతులకు :*
డైరెక్టర్,
పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,
ప్రచురణల విభాగం,
పబ్లిక్‌గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004

# అంకితం



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం తొలి ఉపాధ్యక్షులు

(1986 - 1989)

**కీ॥ శే॥ ఆచార్య తూమాటి దొణప్పగారికి**

గౌరవపురస్సరంగా

# విషయక్రమం

# ఆముఖం

ఆచార్య నాయని కృష్ణకుమారి
*ఎం.ఏ. (తె), ఎం.ఏ. (సం.), పిహెచ్.డి., డి. లిట్.*
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
లలితకళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 500 004.

ఈ ఆకర గ్రంథం పరిశోధకులకు చాలా ఉపయోగకరంగా తీర్చబడిన గ్రంథం. వెనక ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వ్యాసరచనల సూచిని వెలువరించింది. శ్రీ నేలనూతల కృష్ణమూర్తి దానిని సంకలనం చేశారు. విషయం ప్రధానంగా గ్రహించి, ఆ విషయాన్ని ఆధారంగా కొని వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపిన వారి పేర్లు, తదుపరి ఆయా పత్రికల పేర్లూ ఈ వ్యాస సూచిలో అమర్చబడ్డాయి. విషయానికి సంబంధించిన వివరాలు కావలసిన వారికాగ్రంథం చాలా ఉపయోగకరం.

ఈ ఆకర గ్రంథం అందుకు భిన్నమైనది. ఇందులో కేవలం `భారతి' నుండి గ్రహింపబడిన వ్యాసాలకే స్థానం కల్పింపబడ్డది. ప్రధాన సంకలనకర్త, విశ్వవిద్యాలయ గ్రంథాలయాధిపతి డాక్టర్ యం. శంకరరెడ్డి ఆధ్వర్యంలో ఒక క్రమ పద్ధతితో ఈ గ్రంథాన్ని కూర్చడం అమోదించదగ్గ విషయం. వీరు 1973 నుండి 1991 వరకు వచ్చిన భారతి పత్రికలను సేకరించి, వాటిలో వచ్చిన వ్యాసాలను విషయపరంగా అకారాది క్రమంలో పేర్చుకున్నారు. అంతేకాక ఇందులో రచయితల అనుక్రమణికను కూడా చేర్చడం, పరిశోధకులకు మరింత ఉపయుక్తమైన విషయం. అలాగే, ప్రముఖమైన పదాలు, వాటి ప్రాధాన్య లక్షణాన్ని గుర్తించడం వల్ల, అవి యీ గ్రంథంలో ఏ పేజీలో లభ్యం కాగలదో తెలిపే కీలక సమాచారం కూడా ఇందులో స్పష్టం చేయబడ్డది. ఇది డాక్టర్ శంకరరెడ్డి చేసిన మంచి ప్రయత్నం.

ఈ పద్ధతిన ఆంధ్రదేశంలో వ్యాప్తిని పొందుతున్న అన్ని పత్రికలకూ అన్వయించి ఇటువంటి సూచికా సంకలనాలు ఎన్నో తేవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, వివేకవర్ధని, సాహితి, శారద, కిన్నెర వంటి పాత పత్రికలకు కూడా ఇటువంటి సమాచార సూచికా గ్రంథాలు తయారు కావలసిన అవసరం ఉంది. అటువంటి బృహత్ప్రణాళికకు ఆముఖప్రాయమైన ఈ గ్రంథాన్ని పరిశోధకుల మధ్యకు ఆహ్వానిస్తూ సంకలనకర్తలను అభినందిస్తున్నాను.

30-10-1996 — ఆచార్య నాయని కృష్ణకుమారి

హైదరాబాదు

# స్పందన

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్
డా॥ సి. నారాయణ రెడ్డి
ఎం.ఏ., పిహెచ్.డి., డి. లిట్.,
అధ్యక్షులు
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.

తెలుగులో సాహిత్య పత్రికలు తగినన్ని లేవనేది ఆంధ్రవాఙ్మయ జగమెరిగిన సత్యం. ఉన్నకొద్ది పత్రికల్లో కాశీనాథుని నాగేశ్వరరావు గారు ప్రారంభించిన "భారతి" తలమానికం. సృజనాత్మక, విమర్శనాత్మక రచనలకు సముచిత ప్రాధాన్యం కలిగించడంతో పాటు అనేక వైజ్ఞానిక వ్యాసాలను ప్రచురించడంలో "భారతి" పత్రిక అమూల్యభూమిక నిర్వహించింది.

1924 నుంచి 1991 వరకు నిరంతరంగా వెలువడిన "భారతి" లోని వ్యాసాల సూచికని తయారుచేయవలసిన ఆవశ్యకతను సాహిత్యజ్ఞులందరూ గుర్తించారు. ఈ దిశలో పూర్వరంగం మేరకు నేలనూతల కృష్ణమూర్తిగారు కృషిచేయగా ఉత్తరరంగం బాధ్యతను తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం చేపట్టింది. 1973 నుంచి 1991 వరకు వెలువడిన "భారతి" సంచికలకు ప్రామాణిక పద్ధతుల్లో సూచిని రూపొందించే ప్రణాళిక నేను ఈ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడిగా ఉన్నప్పుడు ఏర్పడడం నాకు తృప్తిని అంకురింపజేసిన అంశం. ఆ సంకల్పాంకురం ఎదిగి ఈనాడు ఈ గ్రంథ రూపంలో రేకులు విప్పుకోవడం అత్యంత సంతృప్తిదాయకం.

'భారతి' సంచికల్లోని వివిధ వ్యాసాంశాలను అనుశీలించి, ప్రధాన శీర్షికలుగా వింగడించి, వ్యాసాలతో పాటు రచయితల అనుక్రమణిక కూడా అనుసంధించి ఈ ఆకరగ్రంథం సంకలనం చేసిన విశ్వవిద్యాలయం లైబ్రేరియన్ డా॥ యం. శంకరరెడ్డికి, ఈ బృహత్ వ్యాసంగంలో వారితో కలిసి పనిచేసిన సహాయకులకు నా హార్దికాభినందనలు.

1-02-1997 — డా॥ సి. నారాయణ రెడ్డి
హైదరాబాదు.

# ప్రస్తావన

తెలుగు సాహిత్య పత్రికల్లో "భారతి" స్థానం అద్వితీయం. ఇది 1924 నుండి మార్చి 1991 వరకు, అంటే దాదాపు 67 సంవత్సరాల దీర్ఘకాలం అవిచ్ఛిన్నంగా కొనసాగి, అత్యంత ప్రామాణిక - పరిశోధనా స్థాయి పత్రికగా అశేష ఆదరాభిమానాలను సాధించి వెలుగొందినది.

ఆంధ్రుల అభిమానాన్ని ఎంతగానో చూరగొన్న భారతికి ఒక సూచి అత్యంతావసరం. దీనివల్ల ఈ పత్రికలలో వెలువడ్డ విశిష్ట వ్యాసాది రచనలకు అనంతంగా ఉపయోగం చేకూర్చటం సాధ్యం. శ్రీ నేలనూతల కృష్ణమూర్తిగారు ఇదివరకే కొంత ప్రయత్నం చేశారు. 1875-1972 మధ్య కాలంలో వెలువడిన పత్రికలన్నింటికి వారు వ్యాస రచనల సూచిని తయారు చేయడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ దానిని రెండు భాగాలుగా (వ్యాస రచనల సూచి, తెలుగు రచయితలు --రచనలు) ప్రచురించారు. ఈ సూచి సంకలనంలో శ్రీ నేలనూతల కృష్ణమూర్తి గారు భారతితోసహా, 1875-1972 మధ్య కాలంలో వెలువడిన ఇతర పత్రికలను సయితం చేర్చటం విశేషం. అయితే ఆ తరువాతి కాలంలో ఇందు చేర్చిన పత్రికలలో అనేకం ఆగిపోయాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1983లో తెలుగు విజ్ఞానపీఠంలో లీనం కావటం, ఆ తరువాత తెలుగు విజ్ఞానపీఠం 1985లో తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం కావటం ఒక చారిత్రక సంఘటన. అందువల్ల ఆదిలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్వహించిన ప్రచురణాది కార్యకలాపాలను ప్రస్తుతం పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్నది. ఈ కారణంగానే శ్రీ నేలనూతల కృష్ణమూర్తిగారి వ్యాస రచనల సూచిని కొనసాగిస్తూ, కవి పండిత విమర్శలకు, పరిశోధకులకు ప్రయోజనకరంగా ఉండాలని భావించి సూచీ సంకలనం చేయ సంకల్పించటం, అందుకు అప్పటి ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డి గారు ఆమోదించటం, సంకలనం పూర్తికాగానే ముద్రణ - ప్రచురణలకు ప్రస్తుత ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారు, రిజిస్ట్రార్ శ్రీ డి.వి. సుబ్బారావుగారు సమ్మతించటం దరిమిలా జరిగిన పరిణామాలు.

ఈ మేరకు 1973వ సంవత్సరం నుండి 1991 మార్చి నెల వరకు -అంటే భారతి ప్రచురణ ఆగిపోయిన నెల వరకు - వెలువడిన సంచికలకు సూచిని తయారుచేసి ``భారతి సూచి"గా నామకరణం చేయటమైంది. ఈ సూచీ నిర్మాణంలో తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో లభ్యంకాని సంచికలను వివిధ గ్రంథాలయాలు, కొందరి వ్యక్తుల సహాయ సహకారంతో జిరాక్స్ ప్రతులను తెప్పించి సూచిని పూర్తి చేయటం జరిగింది. కేవలం సూచిని తయారు చేయటమే గాక, తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో లభ్యపరచటమూ జరిగింది. అయితే 1987 జనవరి సంచిక మాత్రం లభ్యంకాలేదు. అలాగే, 1981 మే నుండి నవంబర్ వరకు; 1987 ఫిబ్రవరి నుండి డిసెంబరు వరకు; 1990 మే నుండి సెప్టెంబరు వరకు భారతి సంచికలు ప్రచురణ కాలేదు.

శ్రీ నేలనూతల కృష్ణమూర్తి గారి వ్యాస రచనల సూచిలో వివిధ విషయాలను అక్షర క్రమంలో అమర్చినప్పటికీ `సాహిత్యం' దగ్గరకు వచ్చేసరికి కొంత హేతుబద్ధత కొరవడినట్లు కన్పిస్తుంది. శీర్షికల నిర్ణయం - అంటే విషయాది నమోదులు ఏవని పరిశోధకులు, పాఠకులు

తెలుసుకోవటం కొంత ఇబ్బందికరంగా ఉన్నట్లు తెలుస్తుంది. ఈ సంకలనంలో ఇటువంటి సమస్యలకు తావులేదు. ఇందలి పద్ధతి సులభగ్రాహ్యం.

భారతి సంచికల్లోని సుమారు ఆరు వేల వ్యాసాది అంశాలను సమగ్రావలోకనం చేసి, విషయ విభజన చేసి, మొత్తం 23 ప్రధాన విషయ శీర్షికల కింద వింగడించటమైంది. ఏ ఆరోపమైనా ఈ 23 విషయాలకు పరిమితం. ఈ 23 విషయాలను అక్షర క్రమంలో అమర్చి, అందులో చేరే ప్రతి ఆరోపాన్ని కూడా రచయిత వారీగా అక్షర క్రమంలో అమర్చటమైంది. ఒక విషయంలో ఒకే రచయిత కింద ఒకటికంటే మించిన ఆరోపాలను రచనల పేర్లవారిగా అమర్చటం జరిగింది. సూచిక అనుబంధంగా, రచయితల అనుక్రమణిక, కీలక విషయపద అనుక్రమణికలను కూడా కల్పించటమైంది. రచయితల అనుక్రమణికలో గ్రంథవిమర్శకులను కూడా చేర్చటం జరిగింది. దీనివల్ల నిర్దిష్ట విషయం, విశిష్ట రచయిత నామ అన్వేషణ సులభసాధ్యం.

ఇది మా చిన్న ప్రయత్నం. ఈ ప్రయత్నం సాహితీ వేత్తల, పరిశోధకుల, తదితర పఠితల ఆదరాభిమానాలను చూరగొనగలదని విశ్వసిస్తున్నాను.

17-10-1996 డాక్టర్ యం. శంకరరెడ్డి
హైదరాబాదు.

# ప్రకాశక విజ్ఞప్తి

తెలుగులో పత్రికల సంఖ్య చాలా స్వల్పం. విషయ పత్రికల సంఖ్యను వేళ్ల మీద లెక్కపెట్టొచ్చు. పరిశోధకులకు గరిష్టస్థాయిలో ఉపయోగపడే విషయపత్రికలు తెలుగులో ఎక్కువగా వెలువడక పోవటం పెద్దలోటుగానే భావించాలి. అడపాదడపా వెలువడే పత్రికలైనా ఏవో కారణాంతరాల వల్ల మధ్యలోనే ఆగిపోవటం మరింత బాధాకరమైన విషయం. తెలుగులో రాయగలిగిన సత్తా ఉన్న రచయితలు లేకనే ఇలా జరుగుతోందా? లేకపోతే రాసే వారికి తగిన ప్రోత్సాహం లభించక పోవటం మూలాన పరిస్థితి ఈ విధంగా మారిందా? దీనికి చాలా కారణాలు చెప్పుకోవలసి ఉంటుంది.

పోతే, అన్ని అవాంతరాలను తట్టుకొని ఏదో విధంగా ప్రచురితమవుతున్న విషయ పత్రికలకు వాఙ్మయ నియంత్రణ కార్యక్రమాలు - అంటే ఏ పత్రికలో ఏ వ్యాసం ఎప్పుడు అచ్చయిందీ, ఎవరు రాశారు మొదలైన వివరాలతో సూచీలు గానీ, అనుక్రమణికలుగానీ తయారవుతున్నాయా, కనీసం తయారు చేయటానికి ప్రయత్నాలేవైనా జరుగుతున్నాయా అనేది కూడా ఖచ్చితంగా చెప్పటం కష్టం.

కాగా, శ్రీ నేలనూతల కృష్ణమూర్తిగారు 1875 నుండి 1972 వరకు తెలుగులో వెలువడిన అన్ని పత్రికలకు (ప్రత్యేక సంచికలతో సహా) "వ్యాసరచనల సూచీని" తయారుచేయటం, దాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారు 1977లో రెండు భాగాలుగా - అంటే వ్యాసరచనల సూచీ, తెలుగు రచయితలు - రచనలుగా - అచ్చువేయటం పరిశోధకులకు చాలా ఊరట కలిగించింది.

తర్వాత కాలంలో సాహిత్య అకాడమి తెలుగు విశ్వవిద్యాలయంలో విలీనం కావటం వల్ల అకాడమి నిర్వహించే ప్రచురణ బాధ్యతలన్నీ తెలుగు విశ్వవిద్యాలయమే నిర్వహిస్తున్నది.

శ్రీ నేలనూతల కృష్ణమూర్తిగారు వ్యాసరచనల సూచీ తయారీకి పరిగణనలోకి తీసుకున్న పత్రికల్లో దాదాపు అన్ని పత్రికలూ ఇప్పుడు ప్రచురణ కావటం లేదు. సూచీ నిర్మాణం జరిగిన తర్వాత కొన్ని పత్రికలు కొద్దికాలం ప్రచురితమైనా ఆయా సంచికలు కూడా అలభ్యం. అయితే, ఆంధ్రుల విశేషాభిమానం చూరగొన్న భారతి పత్రిక మాత్రం అనేక ఒడిదుడుకులను, అవాంతరాలను తట్టుకొని 1991 మార్చి నెల వరకు ప్రచురితమైంది. అందుకే శ్రీ కృష్ణమూర్తిగారి వ్యాసరచనల సూచీకి కొనసాగింపుగా ఉంటుందనీ, పరిశోధకులకు గరిష్ట ప్రయోజనకారి కాగలదని భావించి 1973 నుండి 1991 మార్చి నెల వరకు (అంటే - పత్రిక ఆగిపోయే వరకు) వెలువడిన భారతి సంచికలకు "భారతి సూచి"ని తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం ద్వారా తయారుచేయించి ప్రచురిస్తున్నాము. 1973-91 మధ్య కాలంలో భారతి పత్రికలో ప్రచురితమైన ఏ అంశాన్నయినా తెలుసుకోవటానికి "భారతి సూచి" ఉపయోగపడుతుంది. "భారతి సూచి" పరిశోధకుల, కవి పండిత విమర్శకుల, ఇతరత్రా సాహిత్యాభిమానుల ఆదరాభిమానాలను చూరగొంటుందని ఆశిస్తున్నాను.

డి.వి. సుబ్బారావు
రిజిస్ట్రార్
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

తేది : 28-09-1996
హైదరాబాదు

# కృతజ్ఞతలు

భారతి సూచి సంకలనానికి హర్షంతోబాటు వెనువెంటనే ఆమోదం చెప్పిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అప్పటి ఉపాధ్యక్షులు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణ రెడ్డి గారికి, నిర్మాణం పూర్తికాగానే ప్రచురణకు సమ్మతి పలికిన ప్రస్తుత ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి, రిజిస్ట్రార్ శ్రీ డి.వి. సుబ్బారావు గారికి,

ఈ ప్రయత్నంలో సహాయసహకారాలను అందించిన, ఆంధ్ర సారస్వత పరిషత్తు, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం, రాష్ట్ర కేంద్రగ్రంథాలయం, హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయం, సారస్వత నికేతనం, డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, సి.ఐ.ఇ.ఎఫ్.ఎల్. గ్రంథాలయం యాజమాన్యాలకు, వ్యక్తిగతంగా శ్రీ ప్రఫుల్ల చంద్ర గారికి,

కోరిన వెంటనే "భారతి సూచి" కి సందేశాలను, అభిప్రాయాలను, వ్యాసాలను వ్రాసి ఇచ్చిన ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆచార్య సి. నారాయణ రెడ్డి, శ్రీ ఆరుద్ర, డాక్టర్ తిరుమల రామచంద్ర, శ్రీ ఎన్.ఎస్. సుందరేశ్వరరావు, శ్రీ జి. కృష్ణ, డా॥ వి.వి.ఎల్. నరసింహారావు ప్రభృతులకు

**కృతజ్ఞతా సుమాంజలులు.**

సంకలనంలో శ్రమించి సహాయం అందజేసిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయ సిబ్బందికి మరియు సకాలంలో చక్కగా ముద్రించి పుస్తకాన్ని ఘటించిన ఉషా లేజర్ గ్రాఫిక్స్ వారికి మా కృతజ్ఞతలు.

**డాక్టర్ యం. శంకరరెడ్డి**
యూనివర్సిటీ లైబ్రేరియన్

# అభినందన చందనాలు

- ఆరుద్ర

ఎంత శుభవార్త. నాటి "వ్యాసరచనల సూచి"కి కొనసాగింపుగా "భారతి సూచి" వెలువడుతుందని తెలుసుకొని ఎంతగానో సంతోషించాను. "వ్యాసరచనల సూచి" తయారు చేయాలనే సంకల్పం శ్రీ నేలనూతల కృష్ణమూర్తి గారికి నామూలంగానే కలిగింది. నా పరిశోధనలలో కొంత శ్రమ తగ్గించడానికే వారు ఆ బృహత్కార్యాన్ని చేబట్టారు. ఈ సంగతిని ఆయన తమ ముందుమాటల్లో మొట్టమొదటి విషయంగా ఆ సంకలనంలోనే ప్రకటించారు. ఇప్పుడీ కొత్త ప్రచురణ వార్తను విని ఆనందించే వాళ్లలో నేను తొలి వరసలోనే ఉంటాననుకుంటున్నాను.

"వ్యాసరచనల సూచి" పరిశోధకాల పెన్నిధి. కెలకులనున్న తంగేటి జున్ను. అంకస్థితార్థ పేటి. ఇంతటి వెలలేనికానుకను సమర్పించబోతున్న తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయాధిపతికి, వారి సిబ్బందికి యావదాంధ్ర సాహిత్యలోకం ముందుగానే ధన్యవాదాలర్పిస్తుంది. ఇందుమూలంగా నేనొక పూలగుత్తిని అందిస్తున్నాను. ఇది సర్వాంగ సౌష్ఠవ ప్రచురణగా ఉంటుందని ఆశిస్తున్నాను. లోగడ శ్రీ కృష్ణమూర్తిగారు వ్యాసరచనల సూచితో పాటు రచయితల సూచిని కూడ తయారు చేసి జాతికి సమర్పించారు. ఆ సత్సంప్రదాయాన్ని భారతిసూచి సంచాలకులు విస్మరించలేదను కుంటాను.

భారతితో నా అనుబంధం గురించి, అభిప్రాయాల గురించి రాయాలంటే ప్రత్యేకంగా ఒక పెద్ద వ్యాసమే రాయాలి. అది ఇప్పుడు కాదు. ఇక్కడకాదు. వేరొకమారు.

చిరస్మరణీయులు కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఉగాది సంచికలతో పాటు, భారతి సంచికతో పాటు, ఆంధ్రగ్రంథ సూచిని కూడా ప్రచురించి విశిష్టసేవను చేసిన విశ్వదాతలు. భారతి సూచిని తయారు చేయించినట్టే పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు నాటినుంచి నేటిదాక వెలువడిన వివిధ పుస్తకాలను వివరిస్తూ ఒక గ్రంథసూచిని కూడా ప్రచురిస్తే పుణ్యం ఉంటుంది. శుభస్యశీఘ్రం.

తెలుగు విశ్వవిద్యాలయంవారు బహుళార్థసాధకాలైన పరిశోధక గ్రంథప్రచురణలు తలపెట్టినందుకు వారిని మనసారా అభినందిస్తున్నాను.

ఆరుద్ర
1, శివప్రకాశ ముదలి స్ట్రీట్
టి. నగర్, మద్రాసు - 17.

# భారతితో నా అనుబంధం

డాక్టర్ తిరుమల రామచంద్ర

ప్రాతస్మరణీయులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు స్థాపించిన సాహిత్య మాస పత్రిక భారతిని, ఆ పత్రిక చేసిన సేవను తలచుకొన్నప్పుడు నాకు సకల విద్యాధిదేవత అయిన సరస్వతీదేవి సాక్షాత్కరిస్తుంది. ఒక విశ్వ విజ్ఞాన సర్వస్వం పుటలను అల్లారుస్తూ ముందు పరచుకుంటుంది. ముక్తా మరకత శంఖాదిమందితమైన మహాసాగరం గర్జిస్తూ, తరంగ హస్తాలతో ఆహ్వానిస్తూ ఎదురు వస్తుంది; ఫలపుష్ప శోభితమయిన మహారసాలం ఉవ్విళ్లూరిస్తూ కెట్టెదుట నిలుస్తుంది.

భారతి పత్రికలో రచన ప్రచురితమయితే ఏనుగును ఎక్కినంతగా, గౌరవ డాక్టరేట్ బిరుదం లభించినంతగా మురిసి పోయే కాలమది. అలాటి బంగారు కాలంలో నాకు భారతితో పరిచయమయింది. నేను మైలాపూర్ సంస్కృత కళాశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడు భారతి కార్యాలయానికి వెళ్లేవాడిని. భారతి కార్యాలయం ఉన్న తంబుచెట్టివీధిలో అడుగుపెట్టడమే మహాభాగ్యంగా, భారతి కార్యాలయంలో ప్రవేశించటమే భారతిదేవి గర్భాలయంలో ప్రవేశించినంత మహాపుణ్యంగా భావించేవాడిని.

అప్పటి భారతి సంపాదకులు గన్నవరం సుబ్బరామయ్యగారూ, నాకు తిరుపతి సంస్కృత కళాశాలలో ఉపాధ్యాయులుగా ఉండి, భారతిలో ఉప - సంపాదకులుగా చేరిన తిరుమల వేంకటరంగాచార్యులుగారూ నన్ను ప్రేమతో చూచేవారు. సుబ్బరామయ్యగారయితే, తమ సహజ ఛలోక్తులతో "క్షీరకంఠో బాలం" - అని నన్ను వచ్చిన వారికి పరిచయం చేసేవారు.

ఆంధ్రపత్రిక కార్యాలయం, భారతి కార్యాలయం ఆగంతుకులయిన పండితులతో, రాజనీతిజ్ఞులతో మైలాపూర్ కపాలేశ్వరస్వామి దేవాలయం అరవత్తు మువ్వర్ జాతరలాగ ఉండేవి.

భారతిలో వ్యాసాలు వ్రాయమని, పుస్తక సమీక్షలు చేయమని సుబ్బరామయ్యగారు ప్రోత్సహించేవారు; నేను ఏదైనా వ్రాస్తే, చదివి చూచి "నీ వ్రాత, ఆలోచన మరికొంత పక్వం కావాలి" అనేవారు; ప్రచురించేవారుకారు. సుబ్బరామయ్యగారు మహామేధావి, బహుభాషావేత్త, చిన్న చిన్న మాటలతో మల్లెలు కురిపిస్తున్న శైలిలో వ్రాసేవారు. భారతికి వచ్చే రచనలను అవి ఎంత పేరుమోసిన వారవయినా సరే వారి ఎదుటే దిద్ది మెరుగులు తెచ్చేవారు. నేడు గొప్ప రచయితలుగా, కవులుగా, కథకులుగా, నవలాకర్తలుగా పేరుపొంది తలపండినవారు చాలామంది ఆయన పరిష్కృత శేషులే.

ఆ విధంగా భారతిలో ప్రచురితమైన నా మొదటి వ్యాసం "ఆంధ్రచ్ఛందో విశేషములు" ఇది **1935** సెప్టెంబర్ సంచికలో ప్రచురితమయింది. నా రెండవ వ్యాసం "ఎసగు-పొసగు" ఇది **1935** డిసెంబర్ నెలలో పడింది. వీటికి పారితోషికం చెరిపది రూపాయలని గుర్తు. పది రూపాయలంటే ఆ కాలంలో ఇద్దరు ముగ్గురు పిల్లలున్న భార్యా భర్తల నెల భోజనం.

నా వ్యాసం భారతిలో ప్రచురితమయిన దానికంటె రావు సాహెబ్, వ్యవహార భాషా ప్రస్థానాచార్యులు గిడుగు రామమూర్తి పంతులుగారు గురువర్యులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారియింట

ఆ సెప్టెంబర్‌లోనే జరిగిన సమావేశంలో ప్రశంసించినందుకు కనకాభిషిక్తుణ్ణయినట్లు మురిసిపోయాను. "ఎవరండీ ఈ పండితుడు టి. రామచంద్రాచార్యుడు? ఈ నెల భారతిలో చూశారా? బాగావ్రాశాడు. నా భావాలకు చాల దగ్గరగా ఉందండీ వ్యాసం" అన్నారు రామమూర్తి పంతులుగారు ప్రభాకరులతో. ఆయన చిరునవ్వుతో నా వైపు చూపించారు. "అరే! ఇంతకుర్రవాడా? ఎవరో వెంట్రుకలు నెరసినవారనుకున్నానుసుమండీ! "అన్నారు పంతులుగారు. అప్పుడు నాలో కలిగిన భావ శబలత మాటలతో చెప్పలేను. ఒకవైపు సంతోషం, మరొకవైపు వినయం, వేరొకవైపు పొగడ్త విందామనే ఉత్కంఠ, ఇంకొకవైపు ఈ ఒక్కవ్యాసానికే ఇంత మిడిసిపాటా అని విన్నవారు అంటారేమోనని భయసంకోచాలు.... ఇలా.

కాని సుబ్బరామయ్యగారు మాత్రం నా వ్యాసానికి అంతగా స్పందించలేదు "నీవు ఇంకా చిన్న వాడివి. పైకి రావలసినవాడివి. ఈ పండిత వృషభుల కుమ్ములాటలో వేగకావద్దు. నీవు సొంతంగా ఆలోచించు, పరిశోధించు, నీ అభిప్రాయాలు వ్రాయి" అని ఉపదేశించారు.

1935 తర్వాత నేను గ్రామైకరాత్రంగా దేశమంతా తిరుగుతూ ద్విత్రి మాసైకోద్యోగంగా జీవిస్తూ 1947కి మద్రాసుకు తిరిగి వచ్చాను. ఆంధ్రప్రభ దినపత్రికలో చేరాను. ఒక పత్రికలో పని చేస్తున్న ఉద్యోగి ఆ పత్రికకే రచనలు చేయడం పెద్ద మనుష్యుల ఒప్పందం. భారతికి అప్పుడప్పుడు వ్రాసినా ఎక్కువగా ఆంధ్రప్రభ ఆదివారం సారస్వతానుబంధంలోనే వ్రాసేవాడిని. ఆ విధంగా భారతిలో ప్రచురితమయిన నా తొలి పరిశోధన వ్యాసం "ఆంధ్రసాహిత్యంలో స్త్రీ పర్యాయపదాలు". ఇది 1947 జూన్ సంచికలో ప్రచురితమయింది. అడపాదడపా భారతికి వివిధ విషయాలపై వ్యాసాలు వ్రాసేవాడిని.

నేను 1959లో ఆంధ్రప్రభ సంపాదకులతో కలిగిన అభిప్రాయభేదంతో సంపాదకవర్గం నౌకరీమానుకుని కొన్నాళ్లు నిరుద్యోగిగా ఉన్నాను. మద్రాసువంటి మహానగరంలో నావంటివాడు నిరుద్యోగిగా ఎన్నాళ్లు బతకగలడు? ఆంధ్రపత్రికలో చేరుదామనుకున్నాను. సరాసరి ప్రయత్నం చేయడానికి సంకోచించాను. ఆంధ్రపత్రిక యజమానులకు పరిచితులైన వారి ద్వారా ప్రయత్నించడం ఉచితమని తోచింది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నాకు తెలుసు. "అబ్బాయ్! నీకు సాహాయ్యం ఏమైనా కావలస్తే నన్నడుగు. తంబుచెట్టి వీధిలోని మా కార్యాలయానికిరా "అని వారు నాకు 1934లో బ్లాంక్ చెక్కు ఇచ్చారు. కాని, పాతికేళ్లు గడిచిపోయాయి. పంతులుగారు 1938లో శివైక్యం చెందిన పిదప ఆంధ్రపత్రిక కార్యాలయంలో ఎన్నో మార్పులు వచ్చాయి. 1938లోనే సుబ్బరామయ్యగారు రాజీనామా చేశారు. అప్పుడు నాకు తటాలున ఒక ఆలోచన తట్టింది. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో మల్లంపల్లి శరభయ్యగారనే వారు తెలుగు పండితులు. ఆయన సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితుడు, కవి. ఆయన ఆంధ్రపత్రిక సంపాదకులు శంభుప్రసాద్‌గారికి పరిచితులని విన్నాను. ఆయన ద్వారా ప్రయత్నించాలనుకుని, ఆయనను సాహాయ్యం చేయమని కోరాను. ఆయన ప్రయత్నిస్తానన్నారు. ఇదేదో ఉపచారవాక్యంగా కాక, నిజంగానే ప్రయత్నించారు. ఆయన సాయ్యంతో ఆంధ్రపత్రికా కార్యాలయంలో చేరాను.

శంభుప్రసాద్‌గారు నన్నుచూచి, "భారతిని చూస్తుండండి" అన్నారు. నాకు ఆశ్చర్యం, భయం, ఆనందం ఒక్కుమ్మడిగా కలిగాయి. భారతిని ఏమిటి? నేను-చూడడం ఏమిటి?- అని ఆశ్చర్యం కలిగింది. భారతిలో రచనలు పడడమే ఓ అకాడెమి బహుమతిగా ఉన్నకాలంలో నాబోటి అల్పజ్ఞుడు భారతిని నిర్వహించడమా? ఆశ్చర్యంకాక మరేమిటి? ఇంతబరువును మోయగలనా? యజమానుల దృష్టినుంచి పడిపోతానేమో! అని భయం. ఆంధ్రదేశంలోని ప్రతి

పత్రికా రచయితా కోరుకొనే గొప్ప అదృష్టం - ఒక గొప్ప సాహిత్య మాసపత్రికలో పనిచేయడం మాత్రమే కాక, దానికి ఇన్‌చార్జి ఎడిటర్‌గా పనిచేసే అదృష్టం - అయాచితంగా లభించిందన్న ఆనందం!

శివలెంక శంభుప్రసాద్‌గారు గొప్ప మనస్వి. శాంతినికేతనంలో ఎన్నో ఏళ్ళుండి రాజనీత్యాది శాస్త్రాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారు. మంచి అభిరుచులు గలవారు. పదునైన వ్యంగ్యంతో ఆయన వ్రాసిన కొన్ని `తెలుగు వెలుగు'లు మరొకరు వ్రాయలేరని నా విశ్వాసం. నన్నెప్పుడూ ఆయన ఉద్యోగిగా చూడలేదు. నెలకొకసారి సంపాదకులతో సమావేశం జరిపి పత్రికల బాగోగులు పరిశీలించేవారు.

నేను భారతిలో చేరిననాడే ఆయనతో భారతి విషయంలో నా అభిప్రాయాలు తెలిపాను. నేను కొన్ని శీర్షికలు నిర్వహిస్తానని, వందపుటల పత్రికలో కనీసం మూడోవంతు రచనలు కార్యాలయంలో పనిచేసేవారే వ్రాయాలని, రచనలు ప్రచురణకు ఎంపిక చేసిన వెంటనే రచయితకు ప్రతిఫలం పంపాలని, భారతికి పూర్వపు స్థాయి రావడానికి అన్ని సాహిత్య వర్గాలనూ ప్రోత్సహించాలని, పుస్తక సమీక్షల గుణం, గణం పెంచాలని, ``కలగూర గంపలో" వివిధ భాషల సాహిత్య పత్రికలలో ప్రచురితమయ్యే విషయాల సంగ్రహం ఆకరంతోపాటు ఉండాలని, ఏ సాహిత్య ప్రస్థానం పట్లా రాగద్వేషాలు ఉండరాదని- ఇంకా ఏవేవో రాశాను. ఆయన నా బాలిశత్వం సహించి తలపంకించి, సంస్థ విధానాలకు భంగకరంగాని ఏ రచనలయినా ఉండవచ్చునని, భారతికి ఏ రచయిత ఎడలా కోపతాపాలు లేవని స్పష్టపరచారు.

నేను ఉడతా భక్తిగా సాహిత్యసేవ చేయడానికి భారతి ఎంతో అవకాశమిచ్చింది. శంభుప్రసాద్‌గారి సతీమణి శ్రీమతి కామాక్షమ్మగారు భారతిని ప్రత్యేక శ్రద్ధతో చూచేవారు. ఆమె ఆంధ్రప్రదేశ్‌లోని గొప్ప విదుషీమణులలో అగ్రగణ్యురాలు. చిన్ననాడు నాగేశ్వరరావుపంతులు గారు ఆమెను విషయానికి ఒక ఉపాధ్యాయుణ్ని నియమించి, ఇంటనే విద్యావతినిగా చేశారు. ఆ విధంగా ఆమె సంస్కృతాంధ్రాంగ్లాది సాహిత్యాలలోను, సంస్కృతి చరిత్రలలోను గొప్ప వైదుష్యం సంపాదించారు. ఆమె అప్పుడప్పుడు ఫలానా విషయంపై చర్చ ప్రారంభిస్తే ఎలా ఉంటుంది? ఇది వ్రాస్తే బాగుంటుంది, దీనిని గురించి ఆలోచించండి- అని సూచనలిచ్చేవారు. ఆ విధంగా నేను ఎన్నో వ్యాసాలు వ్రాశాను- మౌలికమైనవి.

నేను భారతిలో 'సాహితీసుగతుని స్వగతం"అనే శీర్షిక కింద వరుసగా వివిధ విషయాలపై వ్రాశాను. 'మనవి మాటలు' అనే శీర్షికతో ఒకే ఒక పుట వ్యాసం వ్రాసేవాడిని. కలగూర గంపలో వివిధ విషయాలు సేకరించడానికి ఎప్పుడూ కన్నెమరా లైబ్రరీ, మద్రాసు యూనివర్సిటీ లైబ్రరీ, అడయార్ లైబ్రరీలకు పరుగులు తీసేవాడిని. రామచంద్ర అనేపేరుతోపాటుతి.రా., రా.చ, చంద్ర, తాతాచార్య, ఆచార్య. తారా. (మా పూర్వుల ఊరు అనంతపురం జిల్లా, ధర్మవరం తాలూకా తాడిమర్రి సంస్థానం కనుక తాడిమర్రి రామచంద్ర-తా.రా.), పరిశోధక, పరిశీలక, యాత్రికుడు, సంచారి అనే కలం పేర్లతోను, పేరులేకుండాను భారతిలోను ఆంధ్రపత్రికలోను వ్యాసాలు, పుస్తకసమీక్షలు వ్రాశాను. తెలుగునాట ఇన్ని కలం పేర్లు కల రచయితలేడని నా విశ్వాసం. ఇలా ఎందుకు వ్రాయవలసివచ్చిందంటే, భారతిలో మూడోవంతు కార్యాలయంలో పనిచేసేవారే వ్రాయాలని మొదట్లోనే యజమానులకు నియమం తెలిపాను గదా! ఇంతగా బాధ్యత తీసుకోవడం వల్ల మాసపత్రికకు దినపత్రికలో పనిచేసినంత పరిశ్రమచేయవలసి వచ్చేది. నేను వ్రాసిన వ్యాసాలను ఆయా శీర్షికలపేరుతోనే, సాహితీ సుగతుని స్వగతం, మనవి మాటలు అనే పేరుతోనే పుస్తకరూపంలో ప్రచురించాను. "సాహితీ సుగతుని

స్వగతానికి" 1970లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సాహిత్యపురస్కారం లభించింది. నా వ్యాసాలకు మొత్తంగా తెలుగు విశ్వవిద్యాలయం 1991లో సాహిత్య పురస్కారం ఇచ్చింది.

"భారతి రూపురేఖలే మార్చేశారు రామచంద్రగారు. ఒకొక శీర్షికకు ఒకొక్కశైలి "అంటూ సుప్రసిద్ధ పాత్రికేయులు శ్రీనివాస శిరోమణిగారు నన్ను ప్రశంసించినప్పుడు, అంతటి పెద్దవారు అన్నప్పుడు-సంతోషించక ఏమి చేయమంటారు?

భారతిలో నా పుస్తక సమీక్షలు ఖరాఖండీగా ఉండడం వల్ల పలువురు రచయితలు-బాగా పేరున్నవారే - శత్రువులయ్యారు. తెలుగువారిలో విమర్శ సహనం పెరగలేదు. పుస్తకంలోని విషయాన్ని విమర్శించడం శత్రుత్వంగా భావించే మనస్తత్వం పోలేదు. మనకు తెలిసిన విమర్శ పద్ధతులు రెండే. పూర్వం పూర్తిగా ఒకే దృష్టి కోణంతో తెగడడం, ఇప్పుడు ఎందుకయినా మంచిది, ఎప్పుడు, ఏ విధంగా ఈ రచయిత ఉపయోగపడుతాడో అనే దృష్టితో గ్రంథ కర్తస్థాయిని బట్టి పొగడడం. విమర్శ సాహిత్యంలో ప్రధాన శాఖ; సాహిత్యాన్ని పదికాలాలపాటు ఉండనిచ్చే ఆరోగ్యకరమయిన శాఖ. ఇది నిష్పక్షపాతంగా పెరగాలి. "మీ గ్రంథ సమీక్షలలో పరిశోధన టోన్ తగ్గించడం మంచిది" అని శంభుప్రసాద్‌గారు ఒకమారు నాతో సూచించారంటే ఆయన చెవిలో ఎందరి కొండేలు పడిఉంటాయో అనిపించింది.

భారతి సాహిత్య, భాషా, సంస్కృతి, చరిత్ర, భూగోళ, విజ్ఞానశాస్త్ర, పురాతత్త్వ, లిపి శాస్త్రాదులకు అపారమైన సేవ చేసింది. సంస్కృత సాహిత్యంపైన, ముఖ్యంగా భాస కాళిదాస భవభూతులపైన భారతి ప్రచురించినంత సాహిత్యం దేశంలో ఏ పత్రికా చేయలేదు. పురాతత్త్వానికి-చరిత్రకు భారతి చేసినంత సేవ భారతదేశంలో ఏపురాతత్త్వ శాఖ, ఏ విశ్వవిద్యాలయమూ చేయలేదన్నది సత్యం. ఈ సంప్రదాయాన్నే నేను పాటించాను.

నేను భారతిలో పని చేస్తున్నప్పుడు ఎన్నో గొప్ప శాసనాలు ప్రచురించాను. ఉదాహరణకు కొల్లూరు హర్షవర్ధన శర్మ- మహావిద్వాంసులు సోమశేఖరశాస్త్రి గారి కుమారుడు - కృష్ణరాయల గయ శాసనం, కాటయవేముని శాసనం వంటి అపూర్వ శాసనాలు ప్రచురించాను. బి.ఎన్. శాస్త్రిగారి విష్ణుకుండిన శాసనాలు ప్రకటితమయ్యాయి. నవకవులను ఎందరినో ప్రోత్సహించాను. బాలగంగాధర తిలక్‌గారి "నల్లజర్ల రోడ్డు" వంటి అంతర్జాతీయ స్థాయి కథలను ప్రచురించాను.

నేను వ్యాసాల, ఇతర రచనల ప్రచురణలో ఒక పద్ధతి అనుసరించాను. రచనలో - ముఖ్యంగా చరిత్ర పురాతత్త్వ సంస్కృతి భాషా విషయాల రచనలలో-నాకు సందేహాలు కలిగితే ఆయా రచయితలకు అయ్యా! మీ వ్యాసంలో ఈ తప్పుంది. సవరించి వేయగలను. కాని, ఆతప్పు మీరు సవరించుకుంటే బాగుంటుంది. అలాగే ప్రచురిస్తే, పేరున్న చరిత్రకారులందరూ మీపైన విరుచుకు పడుతారు"అని జాబు వ్రాసేవాణ్ణి. వాళ్లు గ్రహించి సవరించమని కోరేవారు. లేక వారే సవరించి పంపేవారు. ఒకొకప్పుడు ఏకంగా వాళ్లే జాబుచేరిన మరునాడే మద్రాసుకు వచ్చేవారు. నేను శాసనాల వ్యాసాలను శాసన ప్రతిబింబాలతో సరిచూచి తప్పులు సవరించి వేసేవాడిని. కొల్లూరు హర్షవర్ధనశర్మగారు పంపిన కాటయవేముని శాసనం చాల విలువయినది. దానిని ప్రచురించడానికి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు తహతహలాడిపోయారు. ఆ శాసనంలోని తప్పులు చూపి, సవరించివేస్తానని హర్షవర్ధన శర్మగారికి వ్రాశాను? ఆయన ఉత్తరం చేరిన మరుసటి ఉదయమే ఊటీ నుంచి ఊడిపడ్డాడు. మా ఇంటికే వచ్చాడు. ఆయనను నేను చూచినవాడిని కాను. ఎవరండీ అని అడిగేలోపే తనే తన సంగతి చెప్పుకొన్నాడు. ఆయనకు తప్పులు చూపి సవరింపజేసి

ప్రచురించాను. పాపం! హర్షవర్ధనశర్మకు తీరా 30 ఏళ్లు కూడా నిండలేదు. ఏదో ఇంటర్వ్యూకు ఢిల్లీ వెళ్లి పరీక్షహాలులో గుండెపోటుతో మరణించాడు. తెలుగుదేశం గొప్ప చరిత్ర, శాసన పరిశోధకుడిని కోల్పోయింది.

నేను ఉన్నప్పుడు ప్రకటించిన మరొక గొప్ప శాసనం నేలటూరి వెంకటరమణయ్యగారి గంగాధర శాసనం. దీనిని కన్నడ ఆదికవి పంపని తమ్ముడు జినవల్లభుడు వేయించాడు. ఇది సంస్కృత కన్నడ తెలుగులలో ఉంది. దీనివల్ల పంపడు తెలుగుదేశంనుంచి కన్నడదేశానికి వలసపోలేదని, తెలుగుదేశంలోని వేంగీప్రాంతం నుంచి తెలుగుదేశంలోనే ఉన్న వేములవాడకు వచ్చాడని నిర్ణయంకావడంతో కన్నడ సాహిత్య చరిత్రగతే మారిపోయింది.

ఆంధ్రపత్రిక మేనేజరుతో కొంత మనస్తాపం కలగడం వల్ల నేను భారతి వదలి ఆంధ్రప్రభ వారపత్రికలో చేరాను. అక్కడ రెండేళ్లుండి మళ్లీ ఆంధ్రపత్రికకు వచ్చాను. ఆంధ్రపత్రికలో కొన్నాళ్లు రెండవ సంపాదకీయం వ్రాశాను. ఒక నెలపాటు ఎడిటర్ పోలవరపు శ్రీరాములు గారు సెలవు పెట్టడంవల్ల ఆంధ్రపత్రిక ఇన్‌ఛార్జీగా కూడా వ్యవహరించాను.

భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రప్రభ వారపత్రిక మొదలయినవి నాకు ఎంతో అవకాశమిచ్చాయి. ముఖ్యంగా భారతి, ఆంధ్రపత్రిక వారపత్రిక దినపత్రిక నౌకరీలు నా జీవితంలో గొప్ప ఘట్టం. దాదాపు ఏడు దశాబ్దాలు ఆంధ్రావళికి సాహిత్యపు ఆమె తలందించిన భారతికి, నన్ను ఆత్మీయునిగా చూచిన శివలెంక శంభుప్రసాద్‌గారికి, ఎలాటి అరమరికలూ లేక నన్నొక పెద్దన్నగా చూచి గౌరవించిన సౌజన్యమూర్తులు శివలెంక రాధాకృష్ణగారికి, శివలెంక నాగేశ్వరరావుగారికి సదాకృతజ్ఞతతో ఉండడం నా విధ్యుక్తధర్మం.

నేను 1971 జూన్ నెలలో భారతి నుంచి విరమించాను. 1969లో శంభుప్రసాద్‌గారికి మనవిచేశాను. ఆంధ్ర గ్రంథ సూచిలాగే భారతి సూచి సిద్ధపరచాలని నేను 1924 నుంచి 1934 వరకు సూచి సిద్ధపరచాను. అన్ని అమూల్య వస్తువులు ఆంధ్రపత్రిక కార్యాలయం నుంచి పోయినట్టే. ఆ సూచికూడా పోయి ఉంటుంది.

భారతి సేవను గురించి మాత్రమే వంద సిద్ధాంత గ్రంథాలు వెలువడవచ్చు. దానికోసం తెలుగునాట ఉన్న విశ్వవిద్యాలయాలు ప్రయత్నిస్తే బాగుండును.

తేది. 28-07-1996

డాక్టర్ తిరుమల రామచంద్ర
1-4-880/20/8, బరోడా
బ్యాంక్ కాలనీ, గాంధీనగర్,
హైదరాబాద్ - 500 080.

***

# "భారతీ"యులు

ఎన్.ఎస్. సుందరేశ్వరరావు.

ఈ నెల 'భారతి'ఇంకా రాలేదే!
7వ తేది దాటింది -
*　　　*　　　*

మీ వ్యాసం చదివాను.
బాగుంది. ఎన్నోకొత్తవిషయాలు!
*　　　*　　　*

'భారతి' మీ రచనకి
పారితోషకం పంపింది....
పోస్ట్‌మాన్ చెప్పాడు.
*　　　*　　　*

ఒక్కరోజు అటూ ఇటూ అయితే నిస్పృహ
అచ్చయిన వ్యాసాన్ని చదువుకొని ఆనందం.
పారితోషికం అందుకొని బ్రహ్మానందం
ఎందుకో ఈ నిస్పృహ - ఈ ఆనందం.
*　　　*　　　*

'వ్యాసం అందింది. వీలుచూసుకొని
ప్రచురిస్తున్నాం' - అంటే ఆనందం.
వ్యాసం తిరిగి మీకు పంపుతున్నాం-అంటే నిస్పృహ
ఎందుకో- ఆనందం, ఎందుకో-నిస్పృహ
*　　　*　　　*

రచయితలకు, భారతి పాఠకులకు పట్టినవ్యసనం ఇది.
ఉత్తమ సాహితీ ప్రియులందరూ 'భారతి' పత్రికా ప్రియులే
*　　　*　　　*

**తి రజతోత్సవ సభలో సంపాదకులు శంభుప్రసాద్‌గారు:**

"భారతిలో తమ వ్యాసము ప్రకటిత మగుట యన్న
ఒక విశిష్ట గౌరవమను భావము
రచయితలలోనూ ప్రజలలోనూ
వ్యాప్తిజెంది యుండుట

ఆ పత్రికా కుటుంబమగు మాకు గర్వకారణము.

ఈ గౌరవమున 'భారతి'ని
అవ్యాజ కరుణాంతరంగులై
ప్రజ యాదరించుట
'భారతి'జన్మసిద్ధముగ జేసికొన్న అదృష్టము.
నాగేశ్వరరాయల చేతిచలవ"
అన్నారు - సంస్థాపకులను గూర్చి

ఆంధ్రపత్రిక సంపాదకీయం (12-1-1949) లో.

"మాకుటుంబములో 'భారతి'
కడసారపు బిడ్డ
కళా శిక్షణకు, సంస్కృతికి, భావ విశిష్టతకు
ఉత్తమ రసాస్వాదనకు అనువైన
మనః కాయము ఆ పత్రికకు ప్రష్టఅయిన
శ్రీదేశోద్ధారక నాగేశ్వరరావుగారే
జన్మసిద్ధముగా సమకూర్చి పెట్టినారు" అన్నారు.

మద్రాసు చీఫ్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ ఎల్.వి. కోర్ట్ ముందు హాజరై కాశీనాథుని నాగేశ్వరరావుగారు సంపాదకులుగా ప్రకటించుకున్నారు. ప్రథమ పత్రిక (సం.1 సంచిక1) 26-12-1923 న వెలువడినది. రుధిరోద్గారి పుష్యమాసం సంవత్సరానికి చందా 6.0.0., విడి పత్రిక 0-10.0.

ఎవరా నాగేశ్వరరావుగారు?

జాతిపిత మహాత్మాగాంధి
స్వాతంత్ర్య భారత ప్రథమ ప్రధాని
పండిత జవహర్‌లాల్ నెహ్రూ
ప్రశంసలకు నోచుకొన్న
ఏకైక ఆంధ్ర జాతీయుడు
తెలుగువారికి వెలుగు నిచ్చిన
తేజస్వి-దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుగారు.

*  *  *

"గుళ్లకు, గోపురాలకు-

పెండ్లిండ్లకు, ప్రయాణపు ఖర్చులకు -

బిచ్చగాండ్లకు, నిరంతర ఋణయాచకులకు-

పండితులకు, పరమ శుంఠలకు-

వేదాంతులకు, వెకిలి సన్యాసులకు-

సోమరిపోతులకు, సోదాలకు -

ఒకరికేమిటి?

అడిగినవానికి లేదన లేదు

ఆదరించిన వానిని బొమ్మనలేదు"-అని

మున్నంగి శర్మ - "చిత్రశాల భావశబలత"

భారతి వ్యాసపరంపరలో-

ఇన్నిమాటలేల-

'ఆయన కుడిచేతితో ఇచ్చినది ఎడమచేతికి తెలియదని'

ఒక్కమాట- `నిక్కమైన నీలమొక్కటి లాంటిమాట- అన్నారు మహాత్ముడు.

*  *  *

నాగేశ్వరరావుగారు -

సాంఘిక సేవలో సహస్రబాహుడు

స్వాతంత్ర్య సమరంలో ముందుకు దూసుకుపోయిన సేనాని. అటువంటి మహనీయుని ఇంటబుట్టి మెట్టినింటికి కీర్తి తెచ్చింది 'భారతి'

## రజతోత్సవ సభ:

'భారతి' రజతోత్సవం అంటే జ్ఞాపకం వచ్చింది. ఉత్సాహంతో వెళ్లాను నేనూ మా నాన్నగారి వెంట. సంపాదకులు శంభుప్రసాద్‌గారు స్వాగతం పలికారు. వేలూరి శివరామ శాస్త్రిగారు అధ్యక్షుల అభిభాషణ.

"భారతికి జరిపే ఇరవైయైదు హేమంతాల ఈ మహోత్సవంలో సభాధిపత్యం అంగీకరించడానికి నాలో నాకే సందేహంగా ఉన్నది.

ఎందుచేతనంటె-

నేనొక పత్రికాధిపతినిగాను, సంపాదకుడను కాను. పత్రికా నిర్వహణలో కష్టాలు మోసినవాడను కాను. కాబట్టి

'బలము నీవ నాకు భక్తుండ నీయెడ
నాలుబిడ్డలేని యట్టివాడ
కావునన్ను నధిక కారుణ్యమున నిమ్మ
నుజ్ఞ కమలదళమనోజ్ఞ నయన' అని భీష్ముడు

శ్రీకృష్ణుని కోరినటులు మీ అనుజ్ఞ కోరవలసినవాడను.

(ఈ పద్యం శివరామశాస్త్రిగారు చదవగానే ఆయనయెడ నాకళ్లు చెమ్మగిల్లాయి.)

పోనీ, రచయితల పక్షాన నైనా రెండు మేలి మాటలు చెప్పగలనా అంటే ఆ సంసారం కూడా నేను తిన్నగా నిర్వాకం చేసిన వాడను కాను. కాబట్టి సమర్థులు నేపథ్యంలోనే ఉండి

అసమర్థులను పైకి తీసుకురావడానికి చేసిన ప్రయత్నానికి ఫలితంగా నేనిందులకంగీకరించవలసి వచ్చింది" అని తన అధ్యక్షత పదవిని సమర్థించుకున్నారు.

అది 'భారతి' పెళ్లిలా అనిపించింది.

ఆశీర్వచనాక్షతలు జల్లడానికి వచ్చినవారు సాహితీ సమరాంగణంలో వైపువాటాలు ఎరిగిన నెరజాణలు. ఆ - భారతీ ఆరాధన సభారంగం చూడగానే -

'భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు' అని ఉత్తర కుమారుడు చదివిన పద్యం జ్ఞాపకం వచ్చింది. అందరూ సాహిత్య విద్యా తాలింఖానాలో సాముగరిడీలు నేర్చిన వస్తాదులు. తొడసరుపులు, వాల్ సవాళ్లు, మీసాల కొనలు త్రిప్పుట, రచనల ద్వారా చూపి బాహాబాహి, కచాకచి పోరాడుకున్న వారే. కాని 'భారతి'కి అందరూ ముద్దు బిడ్డలే. అందరూ ఆమె ఒడిలో కూర్చుని రచనలు దిద్దుకున్నవారే. ఇటువంటి సాహితీసదస్సు ఇంకోటి 1938లో విజయనగరంలో జరిగింది. అది మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారి షష్ఠిపూర్తిసభ.

ఆ వచ్చినవారు - "అపారశబ్ద శాస్త్రపారంగులైన వైయాకరణులు, వేదాలు తలకిందుగా చదవగల వేదండ తండం, పురాణ ప్రవీణులైన పౌరాణికులు,

'వివిధ తర్కదిగాహిత సమస్తశాస్త్రసాగర గరీయ ప్రతిభులైన తార్కికులు. కడుపు చల్లంగ వేదాలుకన్న గాయత్రీమాత ఎంత అదృష్టం చేసుకుందో అనిపించింది. విజయనగరం సభ నా ఊనషోడశప్రాయంలో,

భారతి రజతోత్సవసభ నిండు జవ్వనంలో ప్రేక్షకుడిగా పాల్గొని తరించాను.

## రచయితలకు లక్ష్మీప్రసాదం:

"రచయితలకు లక్ష్మీప్రసాదం వారితోనే ప్రారంభం అని నేను చెపితే మీరెవరూ వివదింపరని అనుకుంటాను" అన్నారు శివరామశాస్త్రిగారు తమ అధ్యక్షోపన్యాసంలో. శాస్త్రిగారన్నది అక్షరాలా నిజమే.

1933లో నాకు బాగా జ్ఞాపకం. ఒక రోజు మా అమ్మగారు సాయంకాలం లాంతర్లు తుడుస్తున్నారు. మానాన్నగారు అప్పుడే బాంక్ (ఇంపీరియల్ బాంక్) నుండి వచ్చారు. 'మీకేదో ఉత్తరం వచ్చిందండీ" అంది మా అమ్మ. ఆయన కాళ్లు కడుక్కొని మొహంతుడుచుకొని భుజాన్న తువ్వాలు వేసుకొని, "ఏదీ ఆ ఉత్తరం" అన్నారు. "చీకటి పడింది. లాంతర్ వెలిగించు కాంతం" అన్నారు. కవరు చింపి చదివారు. భారతి సంచికలో అచ్చుపడిన మీ వ్యాసాలకు రూ 60/- మనియార్డర్ ద్వారా పంపామని అందుకోమని ముందుగా వ్రాశారు. మా అమ్మ ప్రసాదించిన ఆ వెలుగుతో, కాశీనాథునివారి శ్రీకారంతో ప్రారంభమయిన పారితోషికం 1982లో మా నాన్నగారు చనిపోయేవరకు అందుతూనే ఉంది.

## నాలుగు తరాల అనుబంధం:

ఇంకో విచిత్రమైన సంగతి చెప్పాలి. మాతాతగారికి, కాశీనాథుని నాగేశ్వరరావుగారికీ మధ్య సత్సంబంధాలు ఏర్పడ్డాయి. సుందరం పంతులు అని ఆయన్ని పిలిచేవారు. పాత భారతుల్లో ఆయన కవిత్వ రచనలు పడుతూ ఉండేవి.

తరవాత మా నాన్నగారు మద్రాసు విశ్వవిద్యాలయానికి వెళ్లిపోవడం, అక్కడ శంభుప్రసాద్ గారితో పరిచయమేకాకుండా గాఢమైత్రి ఏర్పడింది. ఒకనాడు శంభుప్రసాద్‌గారు, వేలూరి

శివరామశాస్త్రిగారు మద్రాసులో మేం ఉండే ఆలంగత పిళ్లేవీధి ఇంటికి ఓ సాయంకాలం వచ్చారు. శివరామశాస్త్రిగారు సాయంసంధ్య ఆనాడు మా ఇంటే జరిపారు. ఆయన నీళ్లు తెమ్మన్నారు. ఎందుకో నాకర్థం కాలేదు. తరవాతవారు తూర్పుముఖంగా కూర్చుని సంధ్యవార్చారు. మానాన్నగారు శివరామశాస్త్రిగారిపై దివాకర్ల తిరుపతిశాస్త్రి చెప్పిన పద్యాలు వరసగా చదివి వినిపించారు. 1911లో గుంటూరు కాలేజిలో శివరామశాస్త్రి శతావధానం ముగిసిన తరవాత వారి గురువులు తిరుపతి శాస్త్రిగారు చెప్పిన పద్యం.

"జగతీనాధులు పెక్కుమంది ముదితస్వాంతంబులన్ గాన్కలం
పగ సాంగంబు సలక్షణంబుగ శరద్ద్వావింశతిన్ బేర్మి హె
చ్చగమా యేలిన శతావధాన కవితా సామ్రాజ్యభారంబు మో
యగ పూనం గదవయ్య తండ్రీ శివరామయ్యా చిరంజీవివై ॥

అప్పుడు శివరామశాస్త్రిగారు లేచి మా నాయనగారిని కౌగలించుకొని" ఈ రోజు నేను ధన్యుణ్ణి' మాగురువుగారి పద్యాలు నే నెన్నడోమరచాను. నేడు మీ ద్వారా విని ఉప్పొంగిపోయాను! అన్నారు.

"ఈ రోజు నేనూ ధన్యుణ్ణే. మీ వంటి మహా విద్వాంసులు మా ఇంటి కొచ్చినందుకు - అది 'మీ యోగ్యత మమ్మల్ని రప్పించింది" అంటూ ఇద్దరు కారులో వెళ్లిపోయారు. శంభుప్రసాద్‌గారు ఉన్నంతసేపు మౌనంతో ఉన్నారు. మౌనం ఆయనకి వక్షస్థలే కౌస్తుభం.

శంభు ప్రసాద్‌గారున్నన్నాళ్లూ మా నాయనగారు యూనివర్సిటీ నుండి ఎకాఎకి ఆంధ్రపత్రిక కార్యాలయానికి వెళ్ళి శంభుప్రసాద్‌గారితో కాలక్షేపంచేసి రాత్రి 9 గం.లకి ఇల్లు చేరుకొనేవారు. శంభుప్రసాద్‌గారు ఎప్పుడూ ఫోన్‌చేసి తెలుసుకొని యూనివర్సిటీకి కారు పంపించేవారు. శంభుప్రసాద్‌గారు కార్యాంతరంగా హైదరాబాద్ వచ్చినప్పుడు కూడా మా నాయనగార్కి కబురు తెల్పేవారు.

ఆంధ్రపత్రిక హైదరాబాదు ఎడిషన్ ఏర్పాటయిన తరవాత శంభుప్రసాద్‌గారి పెద్దకుమారులు శివలెంక రాధాకృష్ణగారు ఒకసారి మా నాయనగారిని చూడటానికి నల్లకుంటలోని మా ఇంటికి వచ్చారు. వారి సంభాషణలో జోక్యం చేసుకొని శైవాన్ని గురించి, మతాలను గురించి కొన్ని కొత్త విషయాలు చెప్పాను. రెండురోజుల తరవాత నాకో ఉత్తరం వచ్చింది. "మీకు వీలైనప్పుడు నన్ను కలుసుకోవచ్చు. మీ రాక కోసం ఎదురుచూస్తున్నాను". వీరి తండ్రిగారిలాగే ముక్తసరిగా మాట్లాడటం, ముచ్చటగా మూడుముక్కల ఉత్తరం రాయటం-వీరి కబ్బాయి. శ్రీ రాధాకృష్ణగారిని అంతకుముందు మద్రాసులో అప్పుడప్పుడు కలుస్తూ ఉండేవాడిని. కాస్తపరిచయం ఉంది.

వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఒకరోజు ఫోన్ చేసి వెళ్లాను. వారప్పుడే నేను వస్తానని వారి కార్యదర్శితో చెప్పి కూర్చోబెట్టమని చెప్పారు. కొంతసేపయిన తరవాత పిలుపు వచ్చింది.

'మా ఆఫీసు పనులు పూర్తిచేశాను. సంపాదకీయం రాసి ఇచ్చాను. మనం మాట్లాడుకొనే విషయాలు వేరు. అందుకని మిమ్మల్ని కొంతసేపు బయట కూర్చోబెట్టాను" అన్నారు సంజాయిషీ చెప్పినట్లు. నాకెందుకు సంజాయిషి అని లోలో అనుకున్నాను. తరవాత తరవాత వారితో స్నేహం పెరిగి గట్టిపడిన తరవాత వారి సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని రచయితలపై ఉండే గౌరవాన్ని అర్థం చేసుకోగలిగాను.

ఆ రోజు నేనింటికి వచ్చేసరికి రాత్రి 10గంటలయింది. కారులో నన్ను ఇంటికి పంపారు. ఆహ్వానించిన మనిషిని సగౌరవంగా పంపడమనేది వారిలోనే చూశాను. సాధారణ కుటుంబానికి చెందిన వాడను. ఉద్యోగ హీనుడను. అయినా వారికి రచయితల మీద ఉండే గౌరవాన్ని మరోసారి నొక్కి వక్కాణిస్తున్నాను.

ఆహ్వానితుడనై సభలో పాల్గొని సభముగిసిన తరవాత చేతిలో పూలదండ వదల లేక పట్టుకొంటూ చీకట్లో దేవులాడుతూ, ఏదైనా వాహనం కనబడి కుదురుకొనే వరకు నడిచి వెళ్లుతూ ఉంటే సభానిర్వాహకులు, ఇతర పెద్దలు పక్కగా కారులో కిలకిల లాడుతూ పోయే సంఘటనలెన్నోచూశాను.

అదను చూసి అడక్కుండానే ఆంధ్రపత్రికలో ఉద్యోగం ఇచ్చారు. ఉద్యోగం కాగితం పట్టుకొని కృతజ్ఞత చెప్పడానికి వారి గదిలోకి వెళ్లితే టీ తెప్పించి-

"ఇదిగో సుందరేశ్వరరావుగారు నా భరోసా మీద మీకు ఉద్యోగంలో వేశారు. మీపై అధికారి ఉపసంపాదకుడో, సహాయ సంపాదకుడో ఉంటాడు. ఇతర ఆఫీసు పనుల్లో మేనేజరు ఉంటారు. వారి వద్దనుండి మీరీపనికి అసమర్థులని తెలిస్తే మీకు నష్టం, నాకు అగౌరవం వస్తుంది. అంతే" అన్నారు. 9ఏళ్లుగడిచాయి.

తండ్రి తాతల తెలుగు సాహిత్యాభిరుచి నాకు కొంత అలవడింది. మద్రాస్ ఓరియంటల్ లైబ్రరీలో భాషేతర పండితుల మధ్య రాపాడి అముద్రిత గ్రంథాల పఠనం - తాళపత్రగ్రంథ పరిష్కరణ నేర్చుకున్నాను. ఇదే నా ఎఱుక.

శ్రీ రాధాకృష్ణగారు అవిరళ పుస్తక హస్తభూషణులు. నిరంతర గవేషణాశీలురు. వీరి మెదడు కెక్కని విజ్ఞానమే లేదు. జిజ్ఞాసమెండు. వీరి సంపాదకత్వంలో ఆధునిక రచయితలకు ప్రోత్సాహ మిచ్చారు. రసాయన శాస్త్ర పట్టభద్రులయ్యి కవితారసాస్వాదనీయులు. వీరి మానవతా దృక్పథం వల్లనే అనేక మంది పెద్ద పెద్ద రచయితలు వీరిపై గౌరవాభిమానాలు చూపేవారు. సాహిత్యంలో ఇది కొత్త విషయం అని చెప్పగల నిగూఢ సర్వజ్ఞత్వముగలవారు. ఇటువంటి వారే 'భారతి'వంటి పత్రికా సంపాదన భారం మోయగల సమర్థులు. భారతేకాదు ఆంధ్రసచిత్రవారపత్రిక ఇంటింటా చదివించే పత్రికలా దిద్దితీర్చినవారు వీరే.

భారతి పత్రికను నడిపించడంలో నష్టమేకాని వ్యాపారరీత్యా లాభదాయకంకాదు. అయినా రాధాకృష్ణగారికి దానియందుగల అభిమానం చేత చాలాకాలం నడిపించగలిగారు. 'భారతి'ని నిలిపివేస్తే కించపడిన అభిమాన పాఠకులు భారతి బతికి ఉన్నప్పుడు దాని ప్రచార విక్రయాలపై పట్టించుకోలేదు.

భారతి వల్ల లాభం పొందినవారు రచయితలు. విపరీత నష్టానికి గురైనవారు ప్రచురణ కర్తలు.

'భారతి'కి వచ్చేవ్యాసాలు అప్పుడప్పుడు చూస్తూ ఉండేవాడిని. సాహిత్యానికి చరిత్రకి సంబంధించినంత వరకు తుది నిర్ణయం సంపాదకులదే.

మల్లంపల్లి సోమశేఖర శర్మ, గిడుగు సీతాపతి, తెన్నేటి సూరి, తిరుమల రామచంద్ర, గన్నవరపు సుబ్బరామయ్యగార్లు ఈపనే చేసేవారు. రచయితలు ఏ యే రంగాల్లో నిష్ణాతులో వారికి ఉత్తరాలు రాసి ఆ వ్యాసాలు శంభుప్రసాద్‌గారు తెప్పించేవారు. ఆ ఒరవడి లోనే రాధాకృష్ణగారు వెళ్ళారు. ఈ పని అంత సుకరమైంది కాదు.

రజతోత్సవ సంచికలో "పాతికేళ్ల కవిత్వం"అనే వ్యాసాన్ని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారే రాయాలని శంభుప్రసాద్‌గారి దీక్ష. వారి వెంట నక్షత్రకుడిలాంటి మనిషిని బెట్టి బాకీ తీరేవరకు వదలకుండా వ్యాసం తెమ్మని పురమాయించారట. గ్రంథ విమర్శకి పుస్తకాలు పంపితే నెలల తరబడి జాప్యం చేసే పెద్ద మనుషులు లేకపోలేదు. ఉచితంగా వచ్చిన పుస్తకాలుంచుకొని అసలు విమర్శే పంపనివారు ఉన్నారంటే నమ్ముతారా?

ఇకపోతే కొత్త విషయాలు చెప్పే వ్యాసాలు ఎంతక్లుప్తంగా ఉంటే అంత ప్రచారం పొందుతాయి. పాఠకలోకం వెంటనే చదివి లాభం పొందుతారు. వారిలా చెప్పారు, వీరిలా చెప్పారని పుటలు పుటలు ఎత్తిరాసి పంపుతారు. భారతి పత్రిక అచ్చుపుటలు పరిమితిలో ఉంటాయి. రచయితలందరికీ న్యాయం జరగాలికదా! సంపాదకులకు `గతసంచిక తరవాయి'అనే బృహత్ వ్యాసాలు పత్రికలో వేయటం సుతరాం ఇష్టం లేదు.

ఏ ప్రమాణాలు చూపకుండా భారతంలో ఇలా ఉంది, భరతుడు నాట్యశాస్త్రంలో చెప్పాడు అంటే ఎట్లా ? విశాలమైన గ్రంథాలు, వాటి ఆకరాలు చూపెడితే వ్యాసం ప్రామాణికత్వాన్ని పొందుతుంది.

కొందరు కేవలం పారితోషికం కోసం, మరికొందరు వ్యాసం పడితే పిహెచ్.డి అడ్మిషన్ దొరుకుతుందని, వ్యాసాలు పంపేవారున్నారు.

పాత సిద్ధాంతాలు పోయి కొత్త సిద్ధాంతాలు వెలువడినా విశ్వవిద్యాలయాల్లోనూ, కళాశాలల్లోను, సిద్ధాంత గ్రంథాలలోను అశ్రద్ధవల్లో అలసతవల్లో పాత పాటలే రచయితలు పాడుతూ ఉంటారు. కొందరు `భారతి'ని తెప్పించుకోరు. తెప్పించినా చదవరు. ఆరోపణలన్నీ రచయితల మీదే మోపడం కూడా మంచిది కాదు. భారతికి ఏడాదికొకసారి వివరణాత్మక వ్యాస సూచికలు వెలువరించవలసి ఉండేది. అకారాది వ్యాసాలు, రచయితలు తయారుచేసినంత మాత్రాన సరిపోదు. విషయ వివరణాత్మకంగా వ్యాసాలపట్టిక ఏటేటా వెలువడితే అటు రచయితలకు, ఇటు సిద్ధాంత గ్రంథ రచయితలకు, సంపాదకులకు కూడా బాగా సహాయంగా ఉంటుంది.

'భారతి'పత్రికకు ఒక ప్రత్యేకత ఉంది. అది ఒక్క కవితలకు మాత్రం పెట్టింది కాదు. కథానికలు ఒకటో రెండో ఉంటాయి. సాహిత్యవ్యాసాలు, చారిత్రక, సంగీత, నాట్య, చిత్ర, శిల్పకళా, అర్థశాస్త్ర, భాషాశాస్త్ర, వేదాంత శాస్త్రాలపై వ్యాసాలుంటాయి. కొత్త శాసనాలు ఆర్కియాలజీవారు ప్రకటించడానికి కొన్ని యేండ్లు పట్టొచ్చు. అయితే ఆ అధికారులు 'భారతి'లో మాత్రమే ప్రచురించడానికి అనుమతి ఇస్తారు. పాత భారతులు తిరగవేస్తే పిట్టకథలు, పాత పాటలు కనబడతాయి. జైన, బౌద్ధ మతాలలోని కొన్ని ముఖ్యగ్రంథాల అనువాదాలు కూడా భారతిలో వచ్చాయి. ఆంధ్ర జాతికి సంస్కృతికి సంబంధించిన అపూర్వ వ్యాసాలు ఆంగ్లేయభాషలో ఉంటే వాటి అనువాదం భారతి ఆదరిస్తుంది.

మొదట్లో భారతిలో వ్యాసాలు అచ్చుపడ్డాక పేరు ప్రఖ్యాతులు రాగానే వాటిని సంపుటీకరణం చేసి ప్రత్యేక గ్రంథాలుగా అచ్చువేసుకొన్నవారు కొందరు. విశ్వనాథ సత్యనారాయణ - ప్రసన్న కథా కలితార్థయుక్తి, బులుసు వెంకటేశ్వరులు- భారతి వ్యాసాలు, ప్రభాకరశాస్త్రిగారు - మీగడ తరకలు, తెలుగు మెఱుగులు, కాళోజి హనుమంతరావు - వ్యాసాలు, భమిడిపాటి కామేశ్వరరావు - రచనలు మరికొన్ని ఇతర సంస్థలు ప్రచురించాయి. మానవల్లి రామకృష్ణకవి - మానవల్లి కవి రచనలు, నేలటూరి వెంకటరమణయ్య-సారస్వతవ్యాసాలు, పశ్చిమ చాళుక్యులు, దివాకరుల

వెంకటసుబ్బారావు మొదలైనవారు ఎంతోమంది ఉన్నారు. శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు సంపుటాలు కూడా వచ్చాయి.

కారణాలు ఏమైనా కావొచ్చు. భారతి బ్రహ్మైక్యం చెందింది.

ఏ గ్రంథాలయంలోను భారతి సంపుటాలు పూర్తిగా దొరకవు. వాటి ధర బంగారం కంటె ఎక్కువ గిరాకీ.

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారులు దొరకని భారతి సంపుటాలకు జిరాక్స్ ప్రతులు సంపాదించారు. ఇప్పుడు `భారతి సూచి' కూడా తయారుచేయించారు. వాస్తవానికి ఇట్టిసూచికలు నిపుణులైన లైబ్రేరియన్‌లే చేయాలి.

అట్టిపనిని సంకల్పించి కృతకృత్యులయిన తెలుగు విశ్వవిద్యాలయానికి, ముఖ్యంగా ప్రధాన గ్రంథాలయాధికారికి, వారి సిబ్బందికి నామనఃపూర్వక అభినందనలు తెల్పుతున్నాను.

(శ్రీ నే. శ్రీ. కృష్ణమూర్తి తయారు చేసిన వ్యాసనరచనల సూచి పనిలో నా నిర్వాహకం కూడా ఉంది. అందులో కొన్ని భారతి సంచికలు చేరలేదు)

ఎన్. ఎస్. సుందరేశ్వరరావు
ఇంటి. నెం. 1-4-19/1,
రోడ్ నెం. 7, హబ్సిగూడ,
హైదరాబాదు - 500 007.

***

# సాహిత్య చర్చావేదిక "భారతి"

- జి. కృష్ణ

పాత భారతి పత్రికలు చదవటం మానసోల్లాసకారకం. తెలుగు రచనలు ఎట్లా మారుతూ వచ్చినయ్యో విదితమవుతుంది. శాస్త్రచర్యలు, ఐతిహాసిక విశేషాలు చదువుతుంటే, ఇవేవో మనకు తెలిసీ తెలియకుండా ఉన్నవే అనిపిస్తుంది. తెలిసినవే! మళ్ళీ చదవబుద్ధి పుడ్తుంది.

ఆంధ్ర మహాజనానికి ఈ విజ్ఞానాన్ని అందజేసే సత్సంకల్పంతో దీని వ్యవస్థాపకుడు, ఈ ప్రచురణకు ఉపక్రమించాడని విశ్వాసం కూరుతుంది. తెలుగువారికి అర్థమైన "విశ్వసాహితి", భారతి ద్వారా వ్యక్తమవుతుంది.

1947లో ఆంధ్రపత్రికలో విలేఖరిగా చేరాను. అప్పటినుంచీ "భారతి" సన్నిహితం. రచయితలతో సాన్నిహిత్యం. నెలనెలా భారతిని రూపొందించే పత్రికారచయితతో స్నేహం. ఆంధ్రపత్రిక దినదినం పాఠకులను పలకరించేది. ఆంధ్రపత్రిక వారపత్రిక ప్రతివారం ఆధునిక రచయితలకు, పాఠకులకు ఆత్మీయతనిచ్చేది. భారతిని సందర్శించని పండితుడు, పరిశోధకుడు, తెలుగు నాట ఉన్నాడా అనిపిస్తుంది. దినపత్రిక ఆదివారం అనుబంధం ఈ మూడు ప్రక్రియలకూ చెందీచెందనట్లుండేది.

అప్పట్లో ఈ మూడింటినీ అభిమానించిన విద్యావంతులు అనేకులు. స్థాపకుడు దేశభక్తుడు కావటం, స్థాపనకాలం దేశభక్తి ప్రధానమైనది కావటం, ఒక విధంగా దేశభక్తుల, రచయితల, కవుల జీవితాలకు ఈ మూడూ ఆలంబనం కావటం, ఇటువంటి అభిమానానికి కారణం. దిన పత్రిక వాఙ్మయానికీ, వారపత్రిక సాహిత్యానికీ, భారతి సారస్వతానికీ ప్రాధాన్యమిచ్చేవి అందాం. ప్రతి సంవత్సరం ఈ అన్నింటినీ సమీక్షించి, కొత్త సంవత్సరానికి దారి చూపే విధంగా సంవత్సర పత్రిక వెలువడేది.

రచయితలకూ, పరిశోధకులకూ, కవులకూ, ప్రబోధకులకూ తోడ్పాటు నిచ్చిన ఈ సంస్థలో పనిచేసిన అచ్చు కూర్పరులకు ముందుగా గౌరవ ప్రపత్తులు చూపటం ధర్మం. గుడ్డలునేసి పేరు తెచ్చుకున్నవాళ్లే, అచ్చుకూర్పరులు - వచనానికైనా, కవితకైనా ఒక రాగవరస ఉంటుందనీ, రాగవరస లేకపోతే ఏదో లోపం వచ్చిందనీ వాళ్ల నమ్మకంకాబోలు! దానినే మరొక విధంగా చెప్పుకుంటే, మన విప్లవనిష్ఠ దెబ్బతిన్నట్లు అనుకోరాదు. వచనానికైనా, కవితకైనా ఒక ఛందస్సు ఉంటుందనుకునే వాళ్లన్నమాట. తెలుగుకూ, సంస్కృతానికీ ఇంతే. తెలుగుకు ఒక రాగవరస ఉన్నదని, పాపం, వాళ్లు నమ్మేవాళ్లు! త్యాగరాజు వ్రాసిన కృతులన్నీ ఏదో ఒక ఛందస్సుకు, ఏదో ఒక వరసక్రమానికి ఒదిగేవే. నేటి కాలంలో వరస క్రమంలేకుండా వ్రాయాలంటున్నారు - పైగా వీలయినన్ని ఇంగ్లీషు శబ్దాలు వాడుతూ, వరస క్రమానికి విఘాతం కలిగిస్తున్నారు కదా!

ఏది ఏమయినప్పటికీ, ఆ అచ్చుకూర్పరులు వేగంగా అచ్చు కూర్చేవాళ్లు. భారతి కూర్పు ఒకటి రెండు రోజులపని. అచ్చుతప్పులు ఎక్కువ ఉండవు. తప్పులు దిద్దేవాడు పండితుడే అయి ఉంటాడు. కూర్చిన అచ్చును, అవలీలగా తీసి పుటచక్రంలోకి చేర్చేవాళ్లు. అచ్చు కూర్చటం, అచ్చువేయటం ఒక పవిత్ర కార్యమని అనుకున్నకాలం అది.

స్థాపకుడు కాశీనాథుని నాగేశ్వరరావుగారు తనవద్దపనిచేసే ఉద్యోగులపైన అధికారం చలాయించినట్లు ఎవ్వరూ చెప్పగా నేను వినలేదు. ఆయనకు తన ఉద్యోగులపైన నాయకత్వం సంప్రాప్తించి ఉంటుంది. ఆయనపట్ల వారికి ఏదో గౌరవ ప్రపత్తి ఉండి ఉంటుంది.

భారతికి గన్నవరపు సుబ్బరామయ్య గారనే పండితుని సంపాదకునిగా నియమించాడు. భారతి ఎట్లా ఉండాలో ఒక ఉపన్యాసం ఇచ్చి, "అదీ. అట్లా చేయండి. అది తెలియనివి విప్పిచెప్పాలి. తెలిసినవి సమీక్షించాలి. పెద్దలకు హృద్యంగా ఉండాలి" వగైరా మాటలు చెప్పి, ఈ స్థాయిని సాధించటానికి పనిచేయండని చెప్పాడు. అంతే సుబ్బరామయ్య గారు ఇక, ఈ ఉపన్యాసం ప్రకారం పని చేసుకుపోసాగాడు.

విశాఖపట్నంలో కవితా సమితి అనేది ఉండేది. దానిచుక్కాని, ప్రముఖ దేశభక్తుడు మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) చేతులలో ఉండేది. కవితా సమితి సభ్యులకవనాలు భారతిలో పడేవి. శ్రీరంగం శ్రీనివాసరావు అనే యువకుడు కవితా సమితి సభ్యుడు - పద్యాలు పంపేవాడు. ఒకనాడు ఒక గేయం పంపించాడు. అది సుబ్బరామయ్య గారికి బాగాలేదు. తిప్పిపంపాడు. వెంటనే వచ్చేశాడు రామచంద్రశాస్త్రిగారు! ఆ గేయం వేయండి అని నాగేశ్వరరావుగారు చెప్పనే చెప్పలేదు. రామచంద్రశాస్త్రిగారు వచ్చి "సుబ్బరామయ్యా! ఆ గేయాన్ని భారతిలో వెయ్" అన్నాడు. సుబ్బరామయ్య వేశాడు.

ఆ కాలంలో పండితుల, కవుల మాట వినబుద్ధి పుట్టేది.

ఏమయినప్పటికీ, సంపాదకునికి స్వాతంత్ర్యం ఉండేది. అది నాగేశ్వరరావుగారి అభిమతం కూడాను. నాగేశ్వరరావుగారు వ్రాసినప్పటికీ, దానిని సుబ్బరామయ్య చూడవలసినదే. అందువలన భారతి సరిగా నడిచింది.

మహాపండితులు ఆ కార్యాలయంలో పనిచేశారు. అయినా ఎవరో ఒకరు నాగేశ్వరరావుగారికి తప్పొప్పుల పట్టికలు పంపుతూ ఉండేవాళ్లు. "కూర్చి, గురించి" అనే విభక్తులు ఎందువలననో తికమకలు కలిగించేవి. "దేవమ్మ గూర్చి", వ్యాకరణం ఏమయినా, తగు అర్థాన్నివ్వదు!

ఇటువంటి ఉత్తరాలను ఆయా సంపాదకులకు పంపేవాడు నాగేశ్వరరావు. ఉత్తరాలు వ్రాసినవాళ్లలో కొత్తపల్లి సూర్యారావుగారు కూడా ఉన్నాడు. నాగేశ్వరరావుగారు తప్పొప్పులు తెలియజేయమని పండితులను కోరేవాడు. ఇప్పుడు పండితుల ప్రమేయం లేకుండానే పత్రికలు నడుస్తున్నాయి కదూ! తప్పులు చెప్పేవాళ్లు మాత్రం ఎవ్వరు? చదువుకున్న వాళ్లా!

తలిసెట్టి రామారావుగారు వ్యంగ్య చిత్రాలు వేసేవాడు. వాటిల్లో విద్యావంతులలోకి జొరబడే "అవిద్య"ను గురించి అధిక్షేపణ ఉండేది. ప్రబోధాత్మక వ్యంగ్య చిత్రాలు.

జ్ఞాపకం ఉన్నంతవరకూ ...........

ప్రబంధసుందరి అనే వ్యంగ్య చిత్రం. కళ్లు కలువలు, ముఖం పున్నమి చంద్రుడు. ముక్కు నువ్వుపూవు. నడుం ఆకాశం... వగైరావగైరా ఉపమానాలు. ఆ చిత్రం ఎంత హాస్యాస్పదంగా ఉంటుందంటారు!

మరొకటి ... ఒక శాస్త్రులవారు దేవతార్చన చేసి, దేవునికి ఆహారం నైవేద్యం పెడుతున్నాడు..... నైవేద్యం తంతు ఎంతసేపటికీ ముగిసి పోదు. మంత్రాలు, చురుక్కుమనే దీపారాధన, గంటావాదన

వగైరావగైరా కొనసాగుతున్నాయి. ఎంతసేపు తినకుండా ఆగాలి? దేవుడికి కోపం వచ్చి లాగి తన్న బోయాడు! దేవునికి ప్రాణం ఉంటే, అంతేగదా!

ఇంకొకటి... పురాణం శాస్త్రుల్లు శ్రీకృష్ణుని లీలలు చెప్తున్నాడు. "యమునా పులినములపై శ్రీకృష్ణుడు, గోపికలతో రమించే!" అని నోరూర్చుకుంటూ చెప్తూ, "పులినములు! హా! హా! పులినములంటే...." అని ఏదో అనబోయాడు. శ్రోతలలో ఒకళ్లు "ఇసకండీ" అన్నాడు. శాస్త్రుల్లవారు "అదీ నాయనా!....... శ్రీకృష్ణుడు విసుకు లేక రమించే! శ్రీమద్రమారమణ గోవిందో హారి!" అనేశాడు. సభారంజకత్వమే!

ఇట్లా అనేకం.......

ఈ శతాబ్ద, తృతీయ దశాబ్దంలోనో, కొంచెం అటుఇటుగానో, జంటకవులు, ఆశుకవులు, చిత్రకవులు, కొంచెం ఎక్కువ సంఖ్యలోనే విజృంభించారు. పోటీలు పడేవాళ్లు. కవికవిగా ఉండేవాడుకాడు. ఏదో ఒక మతానికి, కులానికి, శాఖకు, ప్రాంతానికి, వయస్సుకు, లింగానికి, తప్పక చెంది ఉండాలి. ఇట్లా చెంది ఉండటానికి ఇప్పుడు ఈ ఆధారాలేకాక, రాజకీయ పక్షాలు కూడా ఆధారాలై పోయినయ్యి! ఏమైనప్పటికీ, అప్పట్లో, కవిత్వపు పిచ్చి మిక్కుటం. ఋషి కావటానికి కవిత్వం ఒక మార్గం.

పరశురామకవిగారి పద్యోపన్యాసం భలే ఉదాహరణ. కవిగారు "వచనంపు తివురు తెలియకయె, పద్యంబులకు గడగితి" అని చెప్పుకున్నాడు. వచనంలో మాట్లాడడాయె! (శ్రోతల ఖర్మ అంతే). సభకు ఒక (జస్టిస్‌పార్టీ వాడే అయి ఉండాలి) పెద్ద మనిషి అధ్యక్షత వహించి, "మీరందరూ నిశ్శబ్దంగా వినాలని నా ప్రారబ్ధం" అని విజ్ఞప్తి చేశాడు.

సభలో వంటవాళ్లు ఇద్దరుకూడా ఉన్నారు. పరశురామకవిగారు "నే జెప్పునది వినకున్న నే దృష్టినిన్ బొంద పూర్వాపర సందర్భ శుద్ధి లేక బ్రసంగింపు" అని చెప్పుకోగా, వంట పండితులు "చెప్పొకటి, బొంద ఒకటి లేకుంటే ఈ కవిత్వం బాగానే ఉంటుంది" అనుకున్నారు కానీ, "ఎక్కడికి వచ్చినా ఈ పూర్వాపరములు తప్పవా ఏమి?" అని గొణుక్కోవలసి వచ్చింది.

ఈ పద్యోపన్యాసం చదివితే, తప్పక కొందరు ఆంధ్ర ప్రముఖులు స్ఫురిస్తారు. అధ్యక్షుడు కె.వి.రెడ్డి నాయుడు గారే అయి ఉండాలి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారికి అప్పుడు, శాస్త్రిగారికి మహామహోపాధ్యాయ బిరుదాన్ని కూడా ఇప్పించాడు. పరశురామకవిగారు అంటే బహుశా శాస్త్రిగారి శిష్యులు వెంకట రామకృష్ణకవులే అయిఉండాలి.

ఇది చక్కటి హాస్యరచన. అధిక్షేపణ. ఆ రోజులలో పండితులు, కవులు, పరిశోధకులు, కయ్యానికి కాలు దువ్వుతూ ఉండేవాళ్లు. ఎవరైనా ఈ కయ్యాలను గురించి వ్రాస్తే బాగుండును. ఎన్నో కోర్టు కేసులుగూడా నడిచేవి. సాహిత్యంలో పోట్లాడుకోవచ్చు, కోపగించుకోవచ్చు, నవ్వవచ్చు, ఏడవవచ్చు, పరువు నష్టం దావాలు వేసుకోవచ్చు, అని నిరూపించు కున్నారు. ఇప్పుడు అటువంటి మానవతా చర్యలన్నీ రాజకీయవాదులు స్వంతం చేసుకుంటున్నారు.

భారతిలో వాదవివాదాలు నడిచేవి. ఒకడు మనకు అయిష్టం అయినదేదో అంటే దానికి ప్రత్యుత్తరం ఇవ్వటానికి నెలరోజులు ఆగినాం అంటే, ఎంతనిబ్బరం ఉండాలి చెప్పండి.

విశ్వనాథ సత్యనారాయణగారికి, కొత్త సత్యనారాయణచౌదరిగారికి ఏదో వివాదం... శబ్ద చర్చేననుకుంటాను. తప్పేముందీ, శబ్దానికి నోరు పండితుడేగదా. ఈ ఇద్దరూ దాదాపు

ఐదారు సంచికల వరకూ వివాదపడ్డారు. కడకు సత్యనారాయణగారు కోపంతో "నామీద ఒక ద్రావకం బుడ్డీని విసరికొట్టరాదా" అని సత్యనారాయణచౌదరిగారిని అడిగేశాడు. ఇప్పుడు ద్రావకం బుడ్లు సాహిత్యానికి సన్నిహితంగా లేవు.

తెలుగువారికి ఐతిహాసిక విజ్ఞాన ఆసక్తి కలిగించిన వ్యక్తులు అందరూ (దాదాపు అందరూ) భారతి రచయితలే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఐతిహాసాన్ని పరిచయం చేశారు. శర్మగారి ప్రత్యేకత, పరిశోధనకు విధేయత. కానీ, అహదనకర శాసనం వివేచన సందర్భంలో, చాలా ఘాటైన వివాదమే జరిగింది. శర్మగారు శాసనసేకరణ కోసం నెల్లూరు జిల్లాలో చేసిన పర్యటన చక్కటి సాహిత్యం. అన్నట్లు అహద శాసనం ఇంకా పరిశోధకులకు పూర్తిగా తన అర్థాన్ని ప్రసాదించలేదు.

కడకు, భారతి ఇక బబ్బుంటుంది అనే కాలంవచ్చినప్పుడు కూడాను, ఒక చక్కటి శాసనం, దాని విశ్లేషణ ప్రచురించింది. శాసనాలను, స్వతంత్ర పరిశోధకుల వరకూ, పురావస్తు శాఖవాళ్లు రానివ్వరు. ముందే పట్టేస్తారు. ఈ మధ్య శాఖవారు గూడా ఏమీ చేయటంలేదు. ఎందువలన? వాళ్లకు పోటీ లేదుగదా! పరిశోధన పట్ల ఆసక్తి క్షీణించింది. అయినప్పటికీ, దాదాపు ఐదువందల సంవత్సరాల చరిత్ర మరుగునపడి ఉన్న విష్ణుకుండిన చరిత్ర, బి.ఎన్. శాస్త్రి మూలంగా భారతిలో వెల్లడి అయింది. ఏనాటికైనా సరే, భారతి చరిత్ర వ్రాసేవాళ్లు, ఈ విష్ణుకుండిన శాసనాన్ని (తుమ్మలగూడెం శాసనం) భారతి రచయిత బి.ఎన్.శాస్త్రి బయట పెట్టినాడని, నిబ్బరంగా చెప్పవచ్చు.

ఈ శతాబ్దపు ద్వితీయ దశాబ్దంలో మొదలైన భారతి, పంచమ దశాబ్దంనుంచీ, కుంటునారంభించింది.

పత్రిక కుంటువడే దశలో, సంపాదకులుగా పనిచేసేవాళ్లు చాలా చిక్కులు, చిరాకులు అనుభవించవలసి వస్తుంది. రచయితలకు ఒక వ్యక్తిత్వం ఉండి, ఈ చిరాకులు వచ్చిపడ్తాయి.

మిత్రుడు తెన్నేటి సూరి పడిన చిరాకులు కొన్ని చెప్తాను. మిగతా వాళ్లవికూడా కొంతవరకు చెప్పవచ్చుగానీ, ఏవో ఒకటి రెండు మంచి ఉదాహరణలుగానూ, భారతి చరిత్రకు బాగా సంబంధించినవిగానూ గుర్తించి, చెప్పుకుందాం. అన్నీ చెప్పాలంటే, ఒక పెద్ద కలగూరగంప కావాలి.

పెద్ద కలగూరగంపలో పత్రికారచన ఉంటుంది. రచన ఉంటుంది, విరచనలుంటాయి. ఇప్పటికి రచయితలతో సంబంధం ఉన్న పత్రికారచయిత చాలు.

భారతిలో విధిగా ఒక త్రివర్ణ చిత్రంవేసేవాళ్లు. తగు చిత్రం ఎన్ని, పత్రికారచయిత దానికి తగు బ్లాకులు చేయించి, ప్రచురిస్తాడు. అతడికి ఆ స్వాతంత్ర్యం అవసరం. అదీ వివాదానికి దారితీసిన స్వాతంత్ర్యం. యజమానుల వర్గానికి కూడా స్వాతంత్ర్యం ఉంటుందిగదా. యజమానుల వర్గానికి తీరిక ఉండకపోతే!?

సరే.... త్రివర్ణ చిత్ర ప్రచురణను రద్దు చేశారు.

ఆపైన, భారతి అట్టపైన ఏ చిత్రం వేయాలి? అదీ వివాద భూయిష్టం అయింది. ప్రతిమాసానికి ఒక "శీతోష్ణ స్థితి" ప్రత్యేకం కాబట్టి, దానిని రంగు కింద మార్చి, అట్టకు ఆ రంగు వేస్తే సరిపోతుందను కున్నారు.

వారి రోజులు మారుతున్నాయి. భారతిలో వ్యాసాలుకూడా రోజుల మార్పును ప్రతిబింబించాలి. (మరి వారపత్రిక ఎందుకు ఉన్నట్లు?!) ప్రతిబింబించటం కోపం మార్పులు చేసి, భారతికి యౌవనం ఇప్పించారు.

అన్ని వ్యాసాలను సంపాదకుడనే పత్రికా రచయితే చూడాలా? పత్రికా రచయితలు కానివారు గూడా చూస్తే సమగ్ర దృష్టి ప్రయోజనం, వ్యాసాల ఎన్నికకు సంప్రాప్తిస్తుంది. అట్లాగే -

అసలు భారతి వంటి సాంస్కృతిక పత్రికలకు మన దేశంలోని వ్యాపారులు ప్రకటనలు సాధారణంగా ఇవ్వరు. ఇది గొప్పచిక్కు.

పాపం! తెన్నేటి సూరి, భారతి సంపాదకుడు... భాషతో, భావాలతో తేలికగా ఒడబడని వ్యక్తి. సాహిత్య సమవాకారం అని చాలా గొప్పగా అధిక్షేపణ వ్యాసావళి వ్రాశాడు. రచయితలకు "వెరపు" గొలిపాడు. రచయితలను చకితులను చేశాడు. ఏం ప్రయోజనం. భారతి ఒక గుదిబండ అయినట్లయింది.

ఏమయినా, భారతి పత్రిక పత్రికా ప్రపంచంలో ఒక సంప్రదాయాన్ని నెలకొల్పింది. మనకు ఉన్న సత్తానూ, లేని సత్తానూ చూపింది. ప్రబోధాత్మకమైనది. విజ్ఞానదాయి. కాశీనాథుని నాగేశ్వరరావుగారు భారతి ద్వారా రచయితలను, కవులను ఆకట్టుకున్నాడు. భారతి పేర లెటర్ హెడ్లు వేసి, రచయితలకు కవులకు పంపేవాడట! భారతిలో రచన వెలువడ్తే సాహిత్యపు "పెళ్లికొడుక"య్యే వాడు అప్పటి సాహితీ రసికుడు

జి. కృష్ణ
ఇంటి నెం. 1-9-285/4/2,
విద్యానగర్,
హైదరాబాదు - 500 044.

***

# సూచీ ముఖం

'సాహిత్యబ్రహ్మ'
డా॥ వి.వి.యల్. నరసింహారావు

నాకు చాలా సంతోషం కలిగించింది - తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం `భారతి సూచి'ని ప్రచురించబోతున్నదన్న వార్త.

లోగడ ఇటువంటి ప్రయత్నం శ్రీ ఎన్. కృష్ణమూర్తి ఎంతో శ్రమకోర్చి చేశారు. అదికేవలం భారతి పత్రికకు మాత్రమే పరిమితమైనది కాదు; 1875-1972మధ్యకాలంలో వెలువడిన అనేక పత్రికా వ్యాసాలకు, ఇతర విషయాలకు సంబంధించిన వ్యాసరచనల సూచి. దాన్ని ప్రచురించి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పండిత పరిశోధక పఠితృ లోకాభిమానం చూరగొనగలిగింది.

ప్రస్తుతం తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయాధిపతి డా॥ యం శంకరరెడ్డి, వారి గ్రంథాలయ సిబ్బంది కలిసి భారతి సూచిని రూపొందించటం ఆనందదాయకం.

భారతి! అన్నా, భారతి!! దాని నోరు పడిపోయి అప్పుడే అయిదున్నర సంవత్సరాలు కావస్తున్నది. ఆధి వ్యాధులు జీవకోటికి మాత్రమే కాదు; జీవం కల పత్రికలకూ తప్పదన్నమాట!

భారతి అంత ఉజ్జ్వలంగా కాకపోయినా, కవి పండిత రసజ్ఞలోకాన్ని అలరించిన అలనాటి పత్రికలు కొన్ని లేకపోలేదు. 'త్రిలింగ' 'నాట్యకళ, 'మహతి' 'పరిశోధన' మొదలైన వాటిని మర్చిపోలేం. ప్రస్తుతం కొంతలో కొంత ఆలోటు తీరుస్తున్న సాహిత్య పత్రిక తెలుగు అకాడమీ ``తెలుగు" మాసపత్రిక.

పూర్వపత్రికల చరిత్ర చర్వణం ప్రస్తుతాంశంకాకపోవచ్చు. 'భారతి సూచి" ప్రస్తుతం 1973 నుండి - అంటే శ్రీ నే. కృష్ణమూర్తి ఆపిన దగ్గరనుంచి 'భారతి' నిలిచిపోయిన `1991మార్చినెల వరకు వెలువడిన భారతి సంచికలలోని అంశాలు తెలుగు విశ్వవిద్యాలయం 'భారతి సూచి'కి ప్రధానాంశాలు.

వ్యాసాది రచనలు, వాటి కర్తలు, వాటిలోని మౌలిక పదాలు (కీవర్డ్స్) మొదలైన గ్రంథాలయ సమాచార శాస్త్రాంశాలు ప్రాధాన్యం వహిస్తున్నాయన్నమాట.

శాస్త్ర ప్రస్తావన వచ్చింది కనుక ఒక్కమాట చెప్పాలి. ఇంతకూ 'సూచి' అంటే ఏమిటి? నిఘంటువులిచ్చే అర్థాలు 'సూది' అనీ, 'అభినయహస్తవిశేష'మనీ. ఔను! సూది ఏ విధంగా కొనదేరి సూక్ష్మతలాన్ని సూటిగా గుచ్చి చూపిస్తోందో గ్రంథాలయశాస్త్ర పరిభాషలో మనం వాడే `సూచి' అనే పదం కూడా అట్లా సుసూక్ష్మాంశ నిర్దేశం చేస్తుంది.

అన్నట్లు అభినయశాస్త్రంలో 'సూచీముఖ'మనే ఒక అభినయ హస్తం ఉన్నది. ఆ హస్తముద్రలో తక్కిన వ్రేళ్ళన్నీ ముడిచి, ఒక్క చూపుడువ్రేలిని మాత్రం చాచి ముక్కుకు సూటిగా సోకించి దిఙ్నిర్దేశం చెయ్యటం అందులోని ప్రధానాంశం. గ్రంథాలయం పరిభాషలో `సూచి' చేసే పనికూడా అదే కదా!

